**తాత్పర్యము :**

తిరుమంత్ర ద్వయమును సాధించిన ప్రథమాచార్యుడైన గీతాచార్యుడు శ్రీకృష్ణుని ప్రథమముననను, శ్రీనాథముని యామునాచార్యులు మధ్యమమున గలిగి, యిప్పటి మన ఆచార్యులయిన శ్రీరామానుజుని వరకును వ్యాపించియున్న గురుపరంపరకు ప్రణమిల్లుచున్నాను.

పెరియజీయరు అనబడు మణవాళమామునులు శ్రీరామానుజునకు, వారి యాజ్ఞకును గావించిన మంగళాశాసనమును గమనింపుడు:

**శ్లో॥ సర్వదేశ దశాకాలే ష్వవ్యాహత పరాక్రమ ।**
**రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతామ్ ॥**

**తాత్పర్యము :**

శ్రీమద్రామానుజాచార్యుల వారి దివ్యాజ్ఞ ఆటంకములేని పరాక్రమము గలదై సర్వదేశములందును, సర్వకాలములందును అత్యంతము అభివృద్ధిని జెందుగాక!

పరమభాగవతోత్తముడును, మణవాళమామునుల సమకాలికుడును అయిన కందాడైయణ్ణన్ ఇట్లు శ్రీరామానుజార్య దివ్యాజ్ఞకు మంగళాశాసనము పలికియున్నాడు.

**శ్లో॥ రామానుజార్య దివ్యాజ్ఞా ప్రతివాసర ముజ్వలా ।**
**దిగంత వ్యాపినీ భూయాత్ సా హి లోక హితైషిణీ ॥**

**తాత్పర్యము :**

ఈ లోకము యొక్క క్షేమమును గోరునట్టి శ్రీరామా చార్యుల వారి యొక్క దివ్యాజ్ఞ అనుదినమును ప్రకాశించునదియై, లోకమంతటను తప్పక వ్యాపించుగాక !!

**శ్రీరామానుజ దివ్య వైభవము సమాప్తము**

**ఓం**

**శాంతిః శాంతిః శాంతిః**